ముల చీటీలు, చీరలు, శాలువలు, ప్రక్క దుప్పట్లు, తెరలు, టేబిలుగుడ్డలు, చేతి రుమాళ్లు, అంగీలు వగైరా అద్దకము లెన్నో ఖాదీమీద తయారై, అఖిల భారత ప్రదర్శనములందు సైతము తమ ప్రత్యేకతను ప్రకటించుచు ప్రశంస నొందుచున్నవి.

అటులనే చినిలోను, గొల్లపాలెంలోను సాధారణపు బ్లాకులతో పై రకములు ఖాదీ మీద తయారగుచున్నవి. మిగత ఆంధ్ర నగరములలో అద్దకంపరిశ్రమ ప్రస్తుత మే స్థితిలో నున్నదీ తెలుపలేనందుకు విచారపడుచున్నాను. ప్రస్తుత మీ పరిశ్రమవల్ల మన దేశములో కొలదివందలమంది మాత్రమే జీవించుచున్నారు.

గాంధీజీ ముక్తకంఠముతో ఘోషించుచున్న ఖాదీపరిశ్రమ పునరుద్ధరణద్వారానే యీ పరిశ్రమకూడ పూర్తిగా పునరుద్ధరింపబడగలదు. అప్పుడే నేడు పనులులేక అల్లాడుచున్న అసంఖ్యాకులకు యీ వృత్తులవారికి జీవనాధార మేర్పడగలదు.

బర్కెన్ హెడ్ "మనము వర్తకవేషము తోనే మొదట యిండియాకు వచ్చితిమి. ఇదియే మన భావిరాజ్యమునకు పునాది" యని తెలిపిన విషయం జ్ఞప్తియందుంచుకొని, మన వస్త్రపరిశ్రమ నాశనమువల్లనే రాజ్యమును పోగొట్టుకొంటి మనుమాట మరవక, తిరుగ స్వరాజ్యస్థాపనకు ఖాదీని సర్వవ్యాప్తి యగునట్లొనర్చి, మచిలీపట్టణమునకు, యితర ఆంధ్ర నగరములకు, తద్వారా ఆశేషాంధ్రదేశమునకును జగత్ప్రఖ్యాతి నార్జించిన కలంకారీ, అద్దకం పరిశ్రమలను ప్రోత్సహించు భారము నాంధ్రమహాజనులును, భవిష్యజ్జాతీయ ప్రభుత్వమును వహించునట్లీశ్వరు డనుగ్రహించుగాక !



Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad